# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

వ్యవస్థాపకులు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

సంపుటము 13 రాజమహేంద్రవరము 16-9-1990, 1-10-1990 సంచికలు 22, 23

— ఈ సంచికలో —



తరువాత సంచికలోకి ఏరినముత్యాలు.

1. పాతబడిన కొద్దీ రుచులు పెరిగిన వ్యాసం "నా దృష్టిలో ఆధునిక కవితా ధోరణులు" "[illegible]" [illegible] 2. "[illegible]" "వేదన" కవితలు. 3. ప్రాచీన సాహిత్యామృతం – [illegible]

## సంపాదకుని మాట

తెలుగు కవితా వైభవం, కన్నుల పండువుగా వీనులవిందు చేసే మంచిరోజులు వచ్చినవి. తెలుగు సాహిత్యం మళ్ళీ ఊపిరిపోసుకొంటున్నది. ఇందుకు నిదర్శనం వాడవాడలా లేతపాదాలతో మొదలైన నవ్యరచయితల ఉత్సాహం, ఏదో సాధించాలన్న యువరచయితల పట్టుదల, పరిణతి చెందిన పెద్దవారల మార్గదర్శక రచనలు. ఇది అందరూ సంతోషించవలసిన విషయమే! మనసులో మెదిలిన భావాన్ని, హృదయం స్పందింపచేసిన విషయాన్ని చదివించి మళ్ళీ చదవాలనిపించే విధంగా అక్షర రమ్యతతో నిర్దుష్టంగా మలచగలగడం, అంత సులభతరం కాదు. కాని కష్టపడి సాధించినదేదైనా తృప్తి నిస్తుంది. అనుభవం గడించిన కొద్దీ శాశ్వతమైన రచనలు వెలుగులోకి వస్తాయి.

ఆంధ్రులు గర్వించ దగ్గది మన తెలుగుభాష. ఈ భాషలోని అందం, సుగంధం తనివితీరా ఆస్వాదింప చేయడానికి మన ప్రయత్నం మనం చేద్దాం!

— సంపాదకుడు

**…దాదారులకు మనవి:**

…దాకాలం పూర్తి కాగానే
…మంత కాముగా చందా
…పంపించి సహకరించండి.
తమ పూర్తి ఎడ్రసు
పిన్ కోడ్ తో సహా
స్పష్టంగా తెలియ
పరచండి.



**రచయితలకు మనవి:**

రచనలు వ్రాత తప్పులు
లేకుండ, చదవడానికి
వీలుగా స్పష్టంగా
ఉండాలి.

కవితావస్తువు విశ్వజనీనము, సార్వకాలికము. మతభేదాలతో, కులభేదాలతో కొట్టుమిట్టాడుచున్న నేటివ్యవస్థకుఆదర్శ ప్రణయకావ్యం భాగమతి.

ఈకావ్యమందు ప్రధాన పాత్రలు మాలిక్ ఇబ్రహీం, కులీకుతుబ్, భాగమతి, భాగమతితల్లి, సచివుడు. మాలిక్ ఇబ్రహీం అతిదయాళుడు. అంతేకాదు సంగీతసాహిత్యములను పోషించాడు.

'మతము లెన్నైనను కవితామత
మొకటే యను
సంగ ఉరుదున కీడా, తెనుంగ యువగ
తెలుగు కవులను పోషించి నిలిపి, పేరు
గొనిరో, మల్కిభరాముడీ
తెనుగు నేల.'

ఇక కావ్య నాయిక భాగమతి సౌందర్యరాశి. నాట్యంలో వాసి కెక్కింది. రసికపాలకుల పులకింత చేసింది.

'నవ్వుల పూలు జల్లు నయనమ్ముల,
చిల్కలసిగ్గు లీని దా
నవ్వులఁదోలు లీలని నతమ్ముల
అంచలగాల్ నదల్పునే
సొవ్వగ నేయు, సుందరి మనోహర హావ
విశేషమాత్రమేల్
రవ్వల దువ్వ, జాపరుల రంజిల
జేయుచు నాట్యవేళలన్.'

ఇక కులీకుతుబ్ స్వచ్ఛంద ప్రేమికుడు. ప్రేయసిని గుండెలందు హత్తుకొనిన ప్రణయమూర్తి.

'భాగ్యనగరాణీ! నీదు సులివెచ్చని
కౌగిలిదంగ నాకు నా
విన్నుల నుండి వచ్చితిని ప్రేయసి!
గుండియ పూలకుండిలో
విన్నాక మొక్క వేసి తరుణీ!
అనురాగశ్రుః జాలువోసి, నే
గన్నుల నద్దుకొందు కలకాలము
జీవన నందనమ్మునన్.'

ఎంతటి చక్కని ప్రేమ. ప్రేమకై జీవితాన్ని అంకితంచేసిన ప్రేమికుడు.

భాగమతితల్లి యదార్థవాది. అతడు సిద్ధికోసం జీవితాన్ని అంకితంచేసిన ఆదర్శమూర్తి. దేశంకోసం నొసటుదిద్దిన కుంకుమధారబోసిన దేశభక్తురాలు.

భాగమతి కావ్యమందు శృంగారరసం పరవళ్ళు త్రొక్కింది. 'శృంగారీ చేత్కవిః కావ్యేజాతం రసమయం జగత్, సఏవ వీతరాగశ్చేత్ నీరసం జాతమేవతత్.' కవి శృంగారియైనచో కావ్య జగత్తంతయు శృంగార మయమగును. అతడు విరాగి అయినచో కావ్యజగత్తులో నీరసం ప్రతిఫలించునని ఆనంద వర్ధనుని వాక్కు. ఈకావ్యమందు శృంగారం అత్యంతం ఔచితీస్థాయిలో పోషింపబడింది. సచివునకు భాగమతితల్లి చెప్పిన మాటలలో కరుణ రసము కన్పించును.

'వర్ణనా నిపుణః కవిః' అనగా వర్ణనయందు నిపుణం కలవాడుకవి. చక్కటి వర్ణనలు చిక్కనిగా క్రమాలంకారంలో కవి అమర్చాడు.

'అలుకుందనకాచు గోపాలు లీల,
ముద్దు కృష్ణుని వెదికెడు ముదితరీతి
చిలిపి బిడ్డని దండించు చెలి యశోద
కరణి, రూపొందు, నర్తించు,
గానమించు.'

ప్రేమికులకు మనోమంత్రంగా 'కడగండ్లకు లెక్కరాదు ప్రేమజీవికిన్' అని చెప్పాడు.

ఈ ప్రణయ కావ్యమందు ప్రేమసందేశం ప్రేమికుల మనోఫలకంపై శాశ్వత ముద్రవేసింది.

'ప్రేమ ప్రేమనే కోరును-ప్రేమయిచ్చు
ప్రేమనే - ప్రేమఫలమున ప్రేమయాశను
స్వార్థమెఱుగదు-ప్రేమకే చావులేదు!
తన్ను నర్పించుకొనుటలో దనివిపొందు!'

ఈరీతిగా సరసమైన ప్రణయకావ్యం 'భాగమతి' అని తెలియును.

'మహామహుడు కుతుబుషా భాగమతులచరిత
కవికుమారుల మదిలోనఁ గదలు నెపుడు
ప్రణయమూర్తుల కెప్పుడు వాద్యమిడియు
మహిని మతసామరస్యంపు మంత్రము' యు!

సరస ప్రణయం పునాదిగా మతసామరస్య సౌధం నిర్మింపబడిన సుందరశిల్పభవనం 'భాగమతి' కావ్యం.

0—0

# 2. పోతన భక్తితత్త్వము - పరిశీలన

— శ్రీ కంజర్ల రంగాచార్య

సహజపండితుడగు పోతన శ్రీనాథాది కవులవలె రాజులనాశ్రయింపక తన భాగవత రచనకు పూర్వం సాక్షాత్ పుస్తకపాణివాణి పోతనయూ తనను (తనరూపమగు భాగవత కన్యను) రాజులకంకిత మొనర్చునేమోయను బాధతో అశ్రువులు కార్చినట్లుగా భావించి తానామెకు 'కాటుకకంటినీరు చనుకట్టుపయిం బడ ... కర్నాటకిరాతకీచకుల కమ్మవిశుద్ధిగ నమ్మ భారతీ!' యని వాగ్దత్త మొనర్చుట యేకాక తనను గుణముగా 'ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి పురంబులువాహనమ్ములున్ సొమ్ములు కొన్నిపుచ్చుకొని, చొక్కి శరీరమువాసి, కాలుచేవమ్మెటపోటులం బడక సమ్మతితో హరికిచ్చెదనని వచించి, సాక్షాత్ శ్రీరామచంద్రునే తన భాగవతకృతికి పతిగా నొందియు, నానాకావ్య నిర్మాణంలో నిమిత్తమాత్రుడ ననియు దాశరథి కటాక్ష వీక్షణమువనే భాగవత రచన చేయుచున్నా

అని "పలికించెడు రామభద్రుడే"నని వ్రాసిచ్చినాడు. అలాంటి కలముతోను, హాలముతోను దీటైన సవ్యసాచి పోతనామాత్యుని రచనలోని దైవభక్తిని గూర్చి చర్చించుటయే ఈ వ్యాసం ముఖ్యోద్దేశ్యము. మానవ శరీరంలోని కరచరణాద్యవయవములు సర్వం మాధవాంకితము కావలెనని 'కమలాక్షునర్చించుకరములు కరములు శ్రీనాథువర్ణించు జిహ్వ జిహ్వ సురరక్షకుని చూచు చూడ్కులు చూడ్కులు శేషశాయికి మ్రొక్కు శిరము శిరము విష్ణు నాకర్ణించు వీనులు వీనులు మధువైరి దగిలిన మనము మనము భగవంతు వలగొను పదములు పదములు పురుషోత్తముని మీది బుద్ధి బుద్ధి దేవదేవుని చింతించుదినముదినము చక్రహస్తుని ప్రకటించు చదువు చదువు కుంభినీధవు చెప్పెడు గురుడు గురుడు తండ్రి హరి చేరుమనియెడియా తండ్రి తండ్రి' యని తెల్పి ఇట్లు గావించినగాని జన్మసార్థకత నొందదనియు నన్నారు.

పద్మగంధాలు మరిగిన తుమ్మెదలు ఇతర పుష్పముల వద్దకు చేరలేనట్లే తాము శ్రీకృష్ణచరణకమల సేవావిరతిలో మామకుల యొక్కమాటలను లెక్కించమని ఒక గోప యువతిద్వారా చెప్పించిన 'సిరికిముదారచిహ్నములు సేయు భవచ్చరణారవిందముల్ సరసిజనేత్ర మాకవము సంపద జేరిచి పెట్టితేలకున్ మరలగలేము, మామకుల మాటల నొల్లము పద్మగంధముల్ మరగిన తేటులన్య కుసుమంబుల చెంతకు జేరనేర్చునే' యను పద్యంద్వారా ఏకాంత హృదయ వేదనను ఎరింగించిన విషయమెంత హృద్యమో ఇది పోతన కంటె ఇతరులకు సాధ్యమయేనా యని తప్పక నమపించుమగదా: ఈ విషయమునే మరియొక పద్యమగు 'మందార మకరంద మాధుర్యమునదేలు మధుపంబు పోవునే మదనములకు' అది పద్యంలో హరి చరణారవిందసక్తమగు మనము ఇతరంబుల నెలా చేరగలదని ప్రశ్నించినాడు.

శ్రీమన్నారాయణుని యనంతత్వాన్ని తెలుపుతూ వామనావతారఘట్టంలో వామన శరీరవృద్ధి సమయంబున మొదట రవిబింబము ఛత్రముగా, కొంతతడవకు శిరోరత్నముగా, కర్ణాలంకారముగా, కంఠాభరణ కంకణముగను, మువ్వగా క్రమక్రమముగా మారుతూ, చివరకు పాదపీఠమయినదని సహృదయాహ్లాదముగా వర్ణించినాడు (రవిబింబం).

అంతేకాక శ్రీకృష్ణుని బాల్యదశలో అతని మిత్రబృందము కృష్ణుడుమన్ను తిన్నాడని యశోద అతని నోరు తెరువుమని యడిగి ఆ ముఖాంతర్భాగంబున 'అలతాంగి గనుంగొనె, బాలునిముఖమందు జలధి, పర్వత, వన భూగోళ, శిఖి, తరణి, శశి, దిక్పాలాదికరండమైన బ్రహ్మాండంబున్' మాత్రమే కనుంగొని మన్నుగానక సర్వజగత్తంతయును కాని ఇట్లు తలపించినది. ఈ బాలుని ముఖకమలంబున నా మడుగు, గోపులు, యశోదయగు నేను గోపజనబృందము కనుంగొని అపరిచితలయా: నిజమా: యనియాశ్చర్యపోయిన విధానాన్ని తెల్పిన" నామగదు నేను గోపులు అదిగా గల పద్యమున్నూ, 'కలయో: వైష్ణవమాయయో, అదిగాగల పద్యంలోనూ ప్రస్ఫుటపరచినవైన ఎంత రమ్యమో:

ఇంతటిలోనాగగ గోవర్ధన పర్వతమునెత్తిన సమయంబునను అపర్వతం శ్రీకృష్ణుని యంగుళిపై నిలుస్తుందో లేదో: యని శంకించవలదని సమస్త ధరాతలంబును పైబడ్డ నాకరము చలించదని "బాలుండీతడు" యను పద్యమున తెల్పియాశ్చర్య పరచినాడు కదా ఆ సహజపండితుడు.

జ్ఞానబాహుళ్యము గల మానవులేకాక, స్వల్ప జ్ఞానులగు పశువులను శ్రీకృష్ణుని మురళీగానం వింటూ మమతన్ మోములు మీదికెత్తుకొని రోమంథంబు సాలించి హృత్కమలాగ్రంబున దృష్టి నిల్పి మురళీగానామృత శ్రేణి కర్ణములంతొక్కుచు మేతమాని గళితానందాశ్రులై చిత్రితోపమలైన వన్నారు.

మరియును గజేంద్రమోక్ష ఘట్టంలో గజేంద్రుని ద్వారా 'ఎవ్వనిచేజనించు' అదిగా గల ఉత్పలమాలలో సర్వాంతర్యామి యగు యాజగదీశ్వరుని శరణంబువేడెదనని చెప్పించినాడు.

ప్రహ్లాదుని హిరణ్యకశ్యపుడు నీవునమ్మే శ్రీమన్నారాయణుడేడిరా యనియడుగ 'కలడంబోధి కలండు భూమి' యను పద్యం ద్వారా ఆ జగదీశ్వరుడుండు ప్రదేశములు కొన్ని తెల్పి, చివరకు సమస్త జగత్తులో వస్తుచయమును తెల్పిన గ్రంథవిస్తరమగు నేమోయని 'ఇందుగలడందులేడ'ను పద్యంబున ప్రస్ఫుటపరచినతీరు అనన్య సామాన్యముగదా: శ్రీమహావిష్ణువు భక్తపరాధీనతను తెల్పుతూ 'గజేంద్రమోక్ష ఘట్టంలో సిరికిం జెప్పడు" అను పద్యముద్వారా విశదపరిచాడు.

అంతేకాక 'అన్యథాశరణంనాస్తి త్వమేవ శరణంమమ' యను సూక్తిని స్పష్టపరచిన విధంగానే గజేంద్రుడి ప్రయత్నము చేసినంత సేపును రక్షించ నొల్లక 'లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యె ప్రాణంబులున్" అను నీవు తప్ప ఇతరము నాకురక్ష లేదన్న నే కాపాడు నని వివరించాడు.

ఈ ప్రకారంబుగా పోతన నిర్మిత భాగవతంలోని భక్తిసారవారంబునుండి తీసిన ఇసుకరేణువులు మాత్రమే ఈ పద్యములు. అతని భక్తి సాగరాన్ని మధించ మన మెంత వారము.



# 3. కవితా వాహికలు - ఒక పరిశీలన

— డా॥ చేరెడ్డి మస్తాన్ రెడ్డి M. A., Ph. D.

— శ్రీ పాలేపెద్ది రాధాకృష్ణమూర్తి M. A., M. Phil.

జీవకోటి సర్వస్వంలో శ్రేష్ఠతముడైన మానవుడు తనమేధాబలంతో ఏర్పరచుకొన్న అనేక వ్యవస్థలలో సాహిత్యం ప్రముఖమైంది. మన తెలుగు సాహిత్య వృక్షం కావ్యం, పురాణం, ఇతిహాసం, ప్రబంధం, యక్షగానం, నాటకం, నవల, కథ, గేయం, వచనకవిత మొదలైన అనేక ప్రక్రియాశాఖోపశాఖలతో విస్తరిల్లింది.

ప్రక్రియ ఏదైనప్పటికీ తన మనోభావాలను వెలిబుచ్చడానికి కవి ఉపయోగపడుతున్న సాధనాలు - వాహికలు - ప్రధానంగా రెండు. పద్యం, గద్యం, ఇక వాగ్గేయకారులు పదాన్ని తమకు సాధనంగా వాడుకున్నారు.

ప్రకృతి జీవద్వస్తువూ పరిణామశీలమైంది. ఈ సూత్రం సంఘానికి, దాని ప్రతిబింబమైన సాహిత్యానికి అన్వయిస్తుంది. ఈ కారణంగానే ఆధునిక కవులు పద్యాన్ని, గేయాన్ని, వచన కవితను తీసికొని కరవరం వరటుగా రచనలు చేశారు. సహృదయ పాఠకులకు ఈ వాహికలన్నీ స్వీకారయోగ్యమైనవే. అయినప్పటికీ దురదృష్టవశాత్తు పద్యాభిమానులైన కొందరు "ముదివిటులు విధవలంజెలు వచనకవితలు," 'ద్విపద కావ్యంబు ముదిలంజె దిద్దికంత' అంటూ వచనకవితను, పదానికి దగ్గరగావుండే ద్విపదను ద్వేషించారు. అదే విధంగా ఆధునికులు కొందరు పద్యం, గేయం, వచనకవిత - వీటిలో ఒకదానిపట్ల అభిమానాన్ని పెంచుకొని, మిగిలిన వాటిని ద్వేషిస్తున్నారు. ఇది వాంఛనీయం కాదు.

పద్యానికి తప్పనిసరియైన ఛందస్సు 'సర్ప పరిష్వంగం' లాంటిదని, భావప్రకటనకు యతి గణ ప్రాసాది నియమాలు సంకెళ్ళు వేస్తాయని, ఇందువల్ల కవి తాను చెప్పదలచిన విషయాన్ని శక్తిమంతంగా చెప్పలేకపోతున్నాడని కొంతమంది భావిస్తున్నారు. కాని 'అద్యతనాంధ్ర కవి ప్రపంచ నిర్మాత'లైన తిరుపతి వేంకటకవుల పద్యాలను చదివినప్పుడు పై అభిప్రాయం సంపూర్ణసత్యం కాదని తెలుస్తుంది. వారి పద్యాలు నల్లేరుపై బండి లాగా సాగుతాయి.

పద్యాలలో సుదీర్ఘ సమాసాలు ఉంటాయని, అందువల్ల అర్థావగాహనలో ఇబ్బంది ఎదురవుతుందని కొందరంటారు. "అటజని కాంచె" "కాంచెన్ వైష్ణవుఁడు" లాంటి కొద్ది పద్యాలలో ఆ లక్షణముండే మాట వాస్తవమే గాని అది పద్యకవితలో సర్వత్రా గోచరించే లక్షణం కాదు.

పద్యం ప్రాచీన నాగరికతకు చిహ్నమని, అందులో, అభ్యుదయ భావాలను వెల్లడించడం అసాధ్యమని కొందరి ఉద్దేశం. కాని దేశభక్తి, సంఘసంస్కరణ కవిత్వాలలో పద్యం ప్రాముఖ్యం వహించిన విషయం అందరికీ తెలిసిందే. నైజాం నవాబు కబంధ హస్తాలనుంచి తెలంగాణ బయట పడడానికి కవితాశరధి దాశరథి అందించిన అనలాగ్నులు, జాషువగారి అస్పృశ్యతా నివారణ, సంఘ సంస్కరణ ప్రయత్నాలు, విశ్వనాథ, తుమ్మల ప్రభృతుల ఆంధ్రాభిమాన ప్రరోచన, పద్యంలోనే సాగాయి. ఆధునిక వైజ్ఞానిక విజయాలను గురించి కూడా మన కవులు అనేకులు పద్యరచనలు చేశారు.

తాళబద్ధంగానే పద్యాభిమానులైన పాఠకులు గేయాలంటే కట్టుబాటులేని అల్లికలు అని; వచనకవిత అసలు కవితే కాదని, ఛందోబద్ధం కానిదానికి కవిత్వత లేదని, శిష్టులైన పండితప్రవరులు కొందరు అనుకుంటూ విమర్శిస్తూ ఉంటారు. ఇది కూడా పై అభిప్రాయం లాగునే అవిచారరమణీయమైనదే కాని అసలు సత్యం కాదు.

గురజాడ, బసవరాజు, దేవులపల్లి, నండూరి, దాశరథి, నారాయణరెడ్డి మొదలైన వారు రసవత్తరమైన గేయాలను రచించారు. శ్రీశ్రీ, తిలక్, కుందుర్తి మొదలైన వారు భావ సమతలో పద్యాల కంటె మాత్రం తీసిపోని వచనకవితలను వెలయించారు. "మినీ కవితా" రచయితలు "అల్పాక్షరములలో అనల్పార్థరచన"కు ఉత్కృష్టమైన మినీ కవితలను రచించి తాము చెప్పదలచుకున్న విషయాన్ని సూటిగాను శక్తివంతంగాను చెప్పే ప్రయత్నంలో కృతకృత్యులయ్యారు.

కవితా వాహిక ఏదైనప్పటికీ విషయం మాత్రం అస్పష్టత, సంక్లిష్టత, అన్వయకాఠిన్యం, సందిగ్ధత లేకుండా సత్యశివసుందరమై పరిఢవిల్లాలి. అప్పుడే అది ఉత్తమ కవిత్వమనిపించుకొంటుంది. కవులు కూడా ఇటువంటి వైరాలను పెంచుకోకుండా 'వసుధైక కుటుంబకం' అన్నట్లుగా కలిసి మెలసి ఉంటూ ప్రయోజనాత్మకమైన రచనలు చేయాలి. అప్పుడే వారు ఉత్తమ కవులనిపించుకుంటారు.

'ద్రష్టవ్యం కిమపి లోకేఽస్మిన్ న నిర్దోషం న నిర్గుణమ్'. ఈ ప్రపంచంలో కేవలం సద్గుణ సంపన్నమైనది కానీ కేవలం దోష భూయిష్ఠమైనది గానీ ఏదీ లేదు. కనుక విమర్శకులు పద్యం గేయం మొదలైన భాషా విషయాలే సర్వస్వ మనుకోకుండ రచయిత సమాజానికి ఇచ్చిన ఉత్తమ సందేశాన్ని స్వీకరించి, ప్రచారం చేసి మానవత్వాన్ని ప్రదీప్తం చేయాలి. దేశ శ్రేయస్సాధనకు మార్గ సంతంగా అతడిని రూపొందించాలి.

"విశ్వశ్రేయః కావ్యమ్"

మొత్తము మీద ఇరువది అరుశ్లోకములు గలిగియున్న ఈ కావ్యము ప్రసాద గుణభూయిష్ఠమై వసంతతిలక, శార్దూల విక్రీడితాది ఛందస్సులలో నిబద్ధింపబడినది. ఈ కావ్యములో శబ్దాలంకారాపేక్ష లేక స్వభావోక్తి, వ్యాజస్తుతి, మున్నగు కొన్ని అర్థాలంకారములకు మాత్రమే ప్రాధాన్యము గలదు.

మృదుమధుర శైలిలో నొప్పు ఈ సరస కావ్యము దువ్వూరి రామిరెడ్డిగారి దృష్టి నాకర్షించినది. వీరు కూడ అదే మృదుమధుర శైలిలో మూలమునకు వీసమెత్తు కూడ తీసిపోకుండునట్లు యథాతథముగ 'పుష్పబాణవిలాసము' అను పేరుతోనే అనువదించినారు. సంస్కృతమున ఇరువది యారు శ్లోకములతో నున్న ఈ కావ్యము తెలుగున ఇరువదినాలుగు పద్యములతో అవతరించినది. సంస్కృత కావ్యమందలి రెండు శ్లోకములను అసలు అనువదించనే లేదు. అన్ని శ్లోకములను అనువదించిన కవి ఈ రెండు శ్లోకములను బుద్ధిపూర్వకముగా విడిచెననుటకు ఆధారములు కానరాకున్నవి.

మనము ఒక్కసారి దువ్వూరి రామిరెడ్డిగారు తమ ప్రథమ కవిత్వమునకు వ్రాసికొనిన విన్నపమును పరిశీలించినచో ఆ రెండు శ్లోకముల అనువాద విషయము కొంత బయల్పడగలదు.

1915లో దువ్వూరి వారియందు కవిత్వము అంకురించినది. 1916 నుండి 1917 వరకు వారి కవితాభ్యాసకాలము. ఆకాలములోనే రసికజనానందము, స్వప్నాశ్లేషము, అకాల్యానురాగము, కృష్ణనిరాయబారము అను ప్రబంధములను రచించిరి. ఋతుసంహారము, పుష్పబాణవిలాసములను ఆంధ్రీకరించిరి. కాని ఈ కావ్యములు వ్రాతపెరవడి దిద్దుటకు వ్రాయబడు కాపీపుస్తకములలో నున్నవనియు, ప్రకటనార్హములు కావనియు తలంచి మూటగట్టి మూలబెట్టిరి. 1927 నవంబరు నెలలో వీచిన పెనుతుపాను గాలికి కిటికీ తలుపులు వగిలి పుస్తకముల బీరువాలోనికి నీరు ప్రవేశించి పుస్తకములు నానిపోయినవి. వ్రాతప్రతుల వస్త్రముకూడ నానిపోయినది. వస్తువునశించిన పిమ్మట దానిపై ప్రీతి హెచ్చుట సహజముగదా! పిమ్మట భగ్నావశిష్టములైన ఈ కావ్యములను, ఖండకావ్యములను గుర్తింపగలిగినంత మేరకు ఎత్తివ్రాసి 'ప్రథమకవిత్వము'ను పేర ఖండకావ్య సంపుటమున చేర్చిరి.[7]

దీనినిబట్టి దువ్వూరి వారు పుష్పబాణ విలాసమందలి అన్నిశ్లోకములను అనువదించియుండిరనియు, పెనుతుపాను తాకిడికి గురియైన సందర్భమున ఆ రెండుశ్లోకముల అనువాద పద్యములు నశించిపోయియుండుననియు తలచుట అసంగతము కాదేమో!

దువ్వూరివారికి తమ ప్రథమకవిత్వ రచనాకాలమునకే కవిత్వవిషయములో కొన్ని నిర్దిష్టమైనఅభిప్రాయములుగలవు.

'రసికులు మెచ్చుకోవలె, విరాజిత
    తుండలగండ సాలి సొం
పొసగవలెన్; మరందరస మూటలు
    గట్టవలెన్, మిటారి మే
ల్పసిమి వలంద గుబ్బలను బర్యుత జారిన
    బొల్చు ప్రేంబసల్
పొసగవలెం గడింది యటు పొల్పెసగన్
    రచియింతునే కృతిన్'[8]

ఈ పైలక్షణముల కనుగుణముగనే తమ ప్రథమ రచనలో నొకటియగు 'పుష్పబాణవిలాసము'ను అనువదించినారు. వారి అనువాదములో కనుపించని రెండుశ్లోకములను పరామర్శించుట అవశ్యకము.

'సత్యం తద్యదవోచ దాముఖ
    ముఖాన్ రాగ స్త్వదీయాదితి
త్వం ప్రాప్తోఽసి విభాతఏవ సదనం
    ద్రష్టా కాహోయతః
రాగం కించ బిభర్షి నాథ! హృదయే
    కాశ్మీర పత్రోదితమ్
నేత్రే జాగరణం లలాటఫలకే
    లాక్షారసాపాదితమ్'[9]

రేయి పరకాంతవద్ద గడపి ఉదయమునకే సంభోగ చిహ్నములతో వచ్చిన కాంతుని జూచి ఒకానొక నాయిక స్తుతి వ్యాజములో మర్మోద్ఘాటనము చేయుచు పలికిన పలుకులు వర్ణింపబడినవి. నాయందనురాగము మాటలలో మాత్రమే. పరకాంత యందనురాగము గలవాడవని సంభోగ చిహ్నములే స్పష్టము చేయుచున్నవని మర్మార్థము. ఇందు నాయిక ఖండిత.

'ఏతస్మిన్ సహసా వసంతసమయే
    ప్రాణేశ! దేశాంతరం
గంతుం త్వం యతసే తథాపి
    న భయం తాపాత్ప్రవద్యోద్యతా
యస్మాత్కైరవ సార సౌరభముషా
    సాకం సరోవాయునా
చాంద్రీ దిక్షు విజృంభతే రజనిషు
    స్వచ్ఛమయూఖచ్ఛటా'[10]

ఒకానొక నాయిక వసంతసమయములో విదేశములకు వెళ్ళుటకు ప్రయత్నించు

7) దువ్వూరి రామిరెడ్డి, 'కవికోకిల గ్రంథావళి-2 (నెల్లూరు: వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, 1935), పుటలు 239, 240.

8) Ibid, పుట 242.

9) పుష్పబాణ విలాసమ్, పై. ఉ., పుట 21.

10) Ibid పుట 23.

ప్రాచీన సాహిత్యామృతం :

## 6. పింగళి సూరన కళాపూర్ణోదయం - ఒక ప్రస్తావన

— డాక్టర్ మిరియాల రామకృష్ణ

పింగళి సూరన కవిత్వం కళాపూర్ణోదయంలో కేవలం ఆలోచనామృతంగా సాగిపోయింది. ఆయన కలానికి అక్షర రమ్యత కన్నా నుడికారపు సొంపు ఇష్టం. పసగల తెలుగు పలుకులూ సందర్భోచితాలైన సమాసాలూ ఇతని రచన ఒక గనిలాంటిది.

సూరనది ప్రబంధమే అయినా, నాటకీయ శైలిని ఆరాధించాడు. ఈ విషయంలో ఆయన తిక్కనగారి శిష్యుడు.

కళాపూర్ణోదయంలోని కథ ఒక స్వతంత్ర కల్పన. సూరన ప్రతిభనూ, వ్యుత్పత్తినీ, అభ్యాసాన్నీ నిరూపించే అద్భుత కావ్యం కళాపూర్ణోదయం.

పూర్వకవులైన తిక్కన, పెద్దన మొదలైన వారిలో లేని ఒక అపూర్వగుణం పింగళి సూరనలో ఉంది. అదే అపూర్వ కథా నిర్మాణ కౌశలం. కల్పనా కథలు కృత్రిమరత్నాలని రామరాజభూషణుడు ఎగతాళి చేశాడు; కానీ ఆ ఎగతాళిని తిప్పికొట్టాడా సూరన్న? అనిపిస్తుంది. కల్పనా కథలను కూడా రత్నాలుగా చేయవచ్చునని నిరూపించాడనవచ్చు. ఆ అపూర్వరత్నమే కళాపూర్ణోదయం!

వెన్నెలకు చలువ ఉంది; సువాసన లేదు! కర్పూరానికి చలువా సువాసనా ఉన్నాయి; కాని కోమలత్వం లేదు. మలయ పవనానికి చలువా సువాసనా కోమలత్వమూ కూడా ఉన్నాయి; కానీ మాధుర్యం లేదు; మంచి కవిత్వానికి చలువా సువాసనా కోమలత్వం, మాధుర్యం అనే నాలుగు గుణాలుంటాయి అంటూ పింగళి సూరన తన అభిప్రాయాన్ని చమత్కారంగా చెప్పి, అటువంటి మంచి కవిత్వాన్నే కళాపూర్ణోదయంలో అందించాడు.

ముత్యాలను గుచ్చినట్లు కవి శబ్దాలను కూర్చాలనీ, వాచ్యం, లక్ష్యం, వ్యంగ్యం అనే అర్థాల భేదాలను కవి గమనించాలనీ, ఆయా రసభావాలకు తగిన రీతులను కవి ఎన్నుకోవాలనీ శబ్దాలంకారాలనూ అర్థాలంకారాలనూ కవి ఆదరించాలనీ పింగళిసూరన వివరించాడు. దీన్నిబట్టి సూరన అలంకార శాస్త్రాలను క్షుణ్ణంగా చదువుకుని, సాహిత్య శిల్పంలో ఆరితేరిన వాడని అర్థమవుతుంది.

శ్రవ్యకావ్య మర్యాదలేకాక దృశ్యకావ్య మర్యాదలనుకూడా సూరన బాగా గమనించాడు. అందువల్ల ఇతని కావ్యాలు రూపకాలవలెనే గబగబా నడుస్తాయి.

యోగశాస్త్రంలోనూ ఇతనికి ప్రవేశం ఉంది కనుకనే కళాపూర్ణోదయంలో మధురలాలసచేత యోగవిద్యా రహస్యాలను చెప్పించాడు. వివిధవిద్యల పరిచయమే గాక గొప్పలోకజ్ఞత కూడా సూరన కవిత్వంలో కనిపిస్తుంది.

ద్వ్యర్థికావ్యమైన రాఘవ పాండవీయమూ, ప్రఖ్యాత కథావస్తువుతో కూడిన ప్రభావతీ ప్రద్యుమ్నమూ సూరనకు ప్రాచీన కవితా సంప్రదాయాలలో స్థానం కల్పించగా 'కళాపూర్ణోదయం' అతణ్ణి నవ్యకవిగా ప్రతిష్ఠించింది. ఆ నవ్యత వల్లనే సూరన విశిష్ట ఖ్యాతించింది.

సూరన కీర్తి కాలకాలం అతని కళాపూర్ణోదయమే! అది సూరనకళల పూర్ణోదయమే! స్వతంత్ర కల్పనలను బట్టి, ఉత్తమరచనా విధానాన్ని బట్టి, కళాపూర్ణోదయాన్ని ప్రపంచ సాహిత్య రత్నాలలోనే ఒకటిగా చేర్చవచ్చు.

కళాపూర్ణోదయంలో ప్రబంధాల లక్షణాలన్నీ ఉన్నాయి. శృంగారం హృదయస్థానంలో ఉంది. మరి ఇతర ప్రబంధాల కన్నా దీనిలోని విశేషమేమిటంటే 'అపూర్వకథా సంవిధానమే'.

ఆ కథ ఎంతో పెద్దదైనా చక్కగా అల్లుకు పోయిన తీగపందిరిలా ఉంటుంది. లోలోపలి పొరలెక్కువ ఈ కథలో.

ద్వారకలో కలభాషిణి యను వార వనిత వర్ణనతో మొదలయింది. కళాపూర్ణోదయం. ఊయాలలూగుతున్న కలభాషిణిని చూచి, నారద, మణికంధరులు ఆమె సౌందర్యాన్ని వేనోళ్ళ ప్రశంసిస్తారు. ఆ మాటలను విమానంలోపోతున్న రంభా నలకూబరులు వింటారు. రంభకు కలిగిన అసూయయే కథాగమనానికి మూలమవుతుంది. కలభాషిణి నలకూబరుడ్ని చూచి, రంభపై అసూయపడుతుంది. నారదుడు వీరందరిని కలహ జగత్తులోకి ప్రవేశింప చేస్తారు. కలభాషిణి మనసు నలకూబరునిపై వాలినది. కలభాషిణిని నారదుడు శిష్యురాలుగా స్వీకరించాడు.

కలభాషిణి యింటికొక మాయా సిద్ధుడు మణిస్తంభుడు వచ్చి, మృగేంద్ర వాహన ఆలయానికి తీసుకవెళ్ళి బలియీయడానికి ప్రయత్నిస్తాడు. సుముఖాసత్తి ఆమెను రక్షిస్తుంది. మృగేంద్ర వాహన కలభాషిణిని, కరుణిస్తుంది.

కలభాషిణిని, మాయా నలకూబరుడు కనిపిస్తాడు. కలభాషిణి మాయారంభగా వేషం ధరించి నలకూబరుడ్ని పొందుతుంది. ఇంతలో అసలురంభ అక్కడికి రాగా సవతుల పోరు ఆరంభమవుతుంది.

రంభా నలకూబరులు మాయారంభను విడిచిపెట్టి పోతుండగా మాయానలకూబరుడు కలుస్తాడు. నలకూబరు లిద్దరికీ వివాదం వస్తుంది.

కథ ఇంత రసవత్తరంగా మలచబడింది సూరనచేత. మాయా రంభా నలకూబరు లిద్దరునూ కలభాషిణీ మణికంధరులుగా గుర్తింపబడతారు. వీరిద్దరూ ఏనాటినుంచో ప్రేమించుకుని, మాయా రూపాలలో కలుసుకోగల్గుతారు. ఈ కథను బట్టి స్త్రీ పురుషుల ప్రణయభావాలలోని మనాత్మ్యరహస్యం తెలుస్తుంది. తాము ప్రేమించినవారు ఒక విశేష రూపంతో ఉండాలని కోరుకుంటారు స్త్రీ పురుషులు.

కళాపూర్ణోదయంలోని రమణీయమైన కథల్లో సుగాత్రీ శాలీనుల వృత్తాంతం ఒకటి. కాశ్మీర దేశంలో శారదా పీఠానికి చెందిన ఒక పురోహితుని కూతురు సుగాత్రి. ఆమె భర్త శాలీనుడు ఇల్లటపుటల్లుడు. ప్రథమ రాత్రి సుగాత్రి సర్వాభరణ భూషితయై రాగా, అతడామెను తిరస్కరిస్తాడు. కొన్ని రోజుల తర్వాత మగని వశపరచుకోడానికి సుగాత్రి ఎన్నో పరిచర్యలు చేస్తుంది. కానీ అతడు వశపడలేదు.

అత్తగారు శాలీనుడ్ని అసహ్యించుకుని, తోటపనికి నియోగించింది. ఆ తోటలో అతడు పనిచేస్తూండగా ఒక రోజున గాలివాన వస్తుంది. ఆ గాలివానలో తన మగాడేమయిపోతాడో అని సుగాత్రి తోటలోనికి తొందర తొందరగా పరుగెత్తింది. అప్పటి ఆమెరూపం అతిసామాన్యంగా ఉంది. శాలీనుడు ఆ ముస్తాబులేని సహజ సౌందర్యానికి ముగ్ధుడై ఆమెను చేరదీసుకున్నాడు.

మర్నాడు సుగాత్రి అలంకరించుకుని అతని వద్దకు పోగా అతడామెను అసహ్యించుకున్నాడు.

తన భర్తకు అలంకారాలిష్టం లేదనీ సహజ సౌందర్యమే అతనకు కావాలనీ సుగాత్రి గ్రహిస్తుంది.

ఈ కథ ఒక శృంగారపు బరిణె వంటిది. అశ్లీలం లేకుండా, అనౌచిత్యం కాకుండా సూరన దీన్ని అద్భుతంగా నిర్వహించాడు.

కళాపూర్ణోదయంలో సరస్వతీ చతుర్ముఖుల సరసలీలలే కళాపూర్ణుని కథకు బీజాలవుతాయి. ఆదిమదంపతుల ప్రణయకలహాన్ని అతడు మనోజ్ఞంగా చిత్రించాడు. ఆడు వారి హృదయాన్ని సూరన ఎంతో సూక్ష్మంగా పరిశీలించాడు.

కళాపూర్ణోదయం నేటి నవలలవలె కథామధ్యం నుంచి ప్రారంభమై కథాసూత్రాలను మెల్లమెల్లగా ప్రకటిస్తూ పాఠకులకు ఔత్సుక్యం కలిగేలా సాగిపోతుంది.

సూరన హాస్య రసపోషణలో కూడా అందెవేసిన చేయి. పాత్రలు చెప్పదలచిన దాన్ని పూర్తిగా చెప్పక అర్థోక్తిలో విరుస్తాయి. నారదుడు రంభకు సవతి దాపురిస్తుందని వ్యంగ్యంగా సూచిస్తాడు. ఒకే అంకంపై ఇద్దరు పాత్రలు వేర్వేరుగా కలుస్తారు. సఖియలు సుగాత్రిని వేళాకోళాలు చేస్తారు. ఇద్దరు రంభలు, ఇద్దరు నలకూబరులు మనకెంతో హాస్యం అందిస్తారు. మన ప్రబంధాలలో ఇలాంటి హాస్యం చాలా తక్కువ.

పింగళిసూరన వంటి బహుముఖప్రజ్ఞావంతుడైన తెలుగు కవి నభూతో నభవిష్యతి.

(000)

# 7. వేమన కబీరుల భావసామ్యాలు

—శ్రీ ఎస్.వి. రాఘవేంద్రరావు, ఎం.ఏ., ఎం.ఫిల్, పిహెచ్.డి.,

(గత సంచిక తరువాయి)

త్మిక భావ దృష్టికే ఇది అవగతం అవుతుంది. ఇది సనాతన ప్రక్రియ. 'చింతనా క్షేత్రంలోని అద్వైతవాదం భావనా క్షేత్రంలో ప్రవేశించి రహస్య వాదం అవుతుంది.[2]' జీవాత్మను పరమాత్మను గల సంబంధాన్ని ప్రేయసీ ప్రియుల ప్రేమలీలలుగా సంకల్పించి, సంభావించి ఈ రహస్యవాద కవిత్వాన్ని విరచించారు.

'దివ్యము, అలౌకికమైన శక్తితో తన శాంత నిశ్చల సంబంధాన్ని ఎందులో శోధింపగోరుతుందో, జీవాత్మయొక్క అంతర్నిహిత ప్రవృత్తియొక్క ప్రకాశనమే రహస్యవాదం. ఈ సంబంధం రెండింటికీ కించిత్తైనా భేదం లేనంతగా పెంపొందుతుంది' అని డా॥ రామకుమార్ వర్మ గారి అభిప్రాయం.[3]

వాస్తవానికి రహస్యవాదానికి నిర్వచనం ఇదే. ఈ అవస్థను వచ్చినప్పుడు పరమాత్మయొక్క సమస్తగుణాలు జీవాత్మలో ఆరోపింప బడతాయి. జీవాత్మ పరమాత్మలో ఆ ద్విత్వం లేనంతగా కలిసిపో

2. పై గ్రంథంలోనే, పు. 37
3. కబీరు సాహిత్య సమీక్షలో ఉదాహృతం, పు. 24.

ఉంది. జీవాత్మను ప్రకాశింపజేసే ఒక భావన,ఒకశక్తిమాత్రమే మిగిలిపోతుంది. దీని పేరే ఈశ్వర సాక్షాత్కారం లేక దివ్యసంయోగం. ఆత్మ ఈ దివ్యశక్తివల్ల ఈఅవస్థలో తనలో పరమాత్మ గుణాలు, పరమాత్మలో ఆత్మగుణాలు కనిపించేటంతగా ఐక్యమైపోతాయి.

సాధారణంగా రహస్యవాద కవుల రహస్యానుభూతికి ఈ క్రింది విషయాలు ఆధారం. 1. అద్వైతవాదం 2. భక్తి భావంలో ప్రేమభావాన్ని నివేదించడం 3. జన్మజన్మాంతరాలపై విశ్వాసం ఉంచడం 4. సృష్టిలోని అణువు అణువునా పరబ్రహ్మ ఉనికిని అంగీకరించడం 5. ఆత్మఅమరం 6. ప్రపంచం నశ్వరమని ఎంచడం.

మానవునిలో జ్ఞానం పెంపొందే కొద్దీ సృష్టి వైచిత్ర్యాన్ని, సృష్టికర్తయొక్క స్వరూపాన్ని తెలుసుకోవాలనే జిజ్ఞాస ఎక్కువ కాజొచ్చింది. ఎప్పుడైతే మానవుడు జ్ఞానాన్ని ఆశ్రయించి సృష్టికర్త యొక్క స్వరూపాన్ని తెలుసుకోవడానికి సాధన చేశాడో అప్పుడది వేదాంత విషయమైంది. కాని కవి ఆ విషయాన్ని తెలుసుకోవడానికి సాధనచేసి తన అనుభవాల్ని, తన వాణిద్వారా ఒక విశేషమైన పద్ధతిలో అభివ్యక్తం చేసినప్పుడు అది రహస్యవాదం అని పిలవ బడింది.

రహస్యవాదం — కబీరు :

కబీరు హిందీభాషా సాహిత్యానికి ప్రథమరహస్యవాద కవి.

సంత్ కవులు అందరిలో కొద్దో గొప్పో రహస్యవాద భావాలు కనబడటానికి కారణము కబీరుఅంటే సత్యదూరం కాదు.

'ఎవెలిన్ అండర్‌హిల్' అనే విదేశీ రచయిత కబీరు రహస్యవాదం గూర్చి ఇలా అన్నాడు.

'The poet Kabir is one of the most interesting personalities in the history of the Indian mystirism. A great religious reformer. The founder of a sect to which nearly a million northern Hindus still belong, it is yet supremely as a mystical poet that Kabir lives for us.'[1]

అద్వైతవాదం రహస్యవాదానికి ఆత్మ వంటిది. దీన్ని ఆధారంగా తీసుకొనే కబీరు ఆత్మ పరమాత్మలు ఒకటే అన్నాడు. మాయ ఆ రెండింటినీ వేరు చేస్తూ ఉంది. జ్ఞానజ్యోతివల్ల మాయ పటాపంచలైపోగా ఆత్మ పరమాత్మలో లీనమౌతుంది. ఈ విధంగా ఆత్మ పరమాత్మ అభిన్నం. కబీరురహస్యవాదాన్ని ఈ క్రింది వానిలో గమనించండి.

'లాలీ మేరేలాల్ కీ జిత దేఖోతిత
లాల్ ।
లాలీ దేఖన్ మైఁ గయీ మైఁ భీ
హోగయి లాల్ ॥'

'ఈశ్వరుని ప్రకాశం దశదిశలా వ్యాపించిఉంది. ఆ వెలుగుని దర్శించటానికి నేను వెళ్ళితే, నేనుకూడా ఆ ప్రకాశంలో మిళితమై పోయాను.' అని మనస్సు అంటుంది. ఆత్మ పరమాత్మలో లీనమైపోయింది అని చెప్పడం ద్వారా అద్వైతాన్ని ఉపదేశిస్తున్నాడు ,కబీరు.

'చీంటీ చావల్ లై చలీ బిచ్ మేఁ
మిలిగయి దార్ ।
కహ కబీర్ దోవు నా మిలై ఏక్ లే
దూజీ డార్ ॥'

చీమకు బియ్యపుగింజ దొరికింది. దాన్ని తీసుకు వెళ్ళుతుంటే మధ్యలో పప్పు బద్ద కనబడింది, అప్పుడు కబీరు అంటున్నాడు.

'నీవు రెండూ లభించవు. ఒకటి తీసుకొని రెండవది విడిచిపెట్టవలసిందే.'

పై దోహాలోని రహస్య భావాన్ని గమనించండి. మానవుడు ఈ లోకంలో సంసార సుఖభోగాల్ని అనుభవించాలి అనుకుంటే పరమాత్మ లభించడు. పరమాత్మను పొందాలనుకుంటే సంసార సుఖాల్ని త్యజించాలి. 'సంశయాత్మా వినశ్యతి' అని గీతలో చెప్పినట్లు ఏవిధమైననిర్ణయం తీసుకోలేక సందిగ్ధావస్థలో ఉన్న మానవుడు 'రెంటికీ చెడ్డ రేవడ' అవుతాడు.

రహస్యవాదం — వేమన.

వేమన పద్యాలలోకూడా అక్కడక్కడ రహస్యవాదం కనబడుతుంది.

'మొదలు ప్రాణి యగును తుదఁ బక్షి
యగును గాదు
నోరులేదు పండ్లు నాలుగల్లు
జీవ మొకటిలేదు జీవులఁ జంపురా! —
విశ్వదాభిరామ వినురవేమ'

ఈ దేహానికి మొదలూలేదు. తుదా లేదు. ప్రాణులాగ మధ్య పెంపొంది కనబడుతూ ఉంటుంది. అయితే అది తుదకు పక్షికాదు — కాని తలచుకున్నచోట్లకు విహరించి వస్తుంది. అంటే అది మనసు. దానికి నోరులేదు. కాని ఆరు పండ్లున్నాయి. అవే కామం, క్రోధం,లోభం, మోహం, మదం, మాత్సర్యం అనే అరిషడ్వర్గం. ఈ అరిషడ్వర్గానికి జీవం లేకపోయినా జీవుల్ని చంపుతుంది.[1]

ఎడ పెడా ఈవిధంగా వేమన కబీరుల భావాల్లో సామ్యం ఉండటమే కాకుండా వీరిద్దరి కవిత్వంలో రహస్యవాదం కనబడుతూ ఉంది. * * *

---

1. సటీక్ కబీర్ దోహావళి. పీఠిక. పుట. 18

1. వేమన పద్యరహస్యార్థ తాత్పర్య బోధిని సం. 2, పు. లు. 88,89.

(*.*)

## నిను భజించెద భారతీ!

— శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు

కం. జయ జయ జయ జనయిత్రీ!
జయ జయ శశరాయమాన చంచన్నేత్రీ!
జయ జయ ధాతృ కళత్రీ!
జయ జయ విద్యా ప్రదాత్రి! జయ
శుభగాత్రీ!!

కం. చంచత్కచ్ఛపినామ వి
పంచీ కలనాదమోదభవ పులకాంగీ!
ప్రాంచన్నిగమాగమవన
సంచార మనోజ్ఞ దివ్య సత్సారంగీ!!

సీ. *అజిత మానస మానసాంతర్నిరంతర
కేలివిలోల మరాళబాల!
శరదిందు మందార హర హీర నీహార
గౌరవాభ కృతాకారభావ!
అష్టమీశశధరాహంకార ధిక్కార
తిలక విభ్రాజిత దివ్య నిటల!
సుకవి ప్రవరకృత నికర జిహ్వాగ్ర సిం
హాసనాధ్యాసినీ! హంసవాహ!

తే. గీ. కనక కచ్ఛపి ధృతకర! గానలోల!
హస్త కలిత లలిత మహితాక్షసూత్ర!
వాణి! పుస్తకపాణి! గీర్వాణవినుత!
సకల సౌభాగ్య సారదా! శారదాంబ!!

తే. గీ. భువన రచనమ్మునందు
సంభోజజాసను
సముఖమున నుండి తీసెడు సాయమీవు
కవన రచనమ్మునందు సత్తువుల కిడెదు
రసములొల్గు పదార్థముల్ రసన నిల్పి

+మా. ఛం. చరాచర నిర్మాతధాతకు
చతుర్ముఖముల క్రమముగన్
పరాపశ్యతి మధ్యమా వైఖరీ రూపుల
వెలసి తా
సరస్వతి! విద్యా ప్రదాయిని! శారదా!
సుఖసారదా!
నిరంతరమున్ హృదంతరమున నిను
భజించెద భారతీ!

( * అజితః - బ్రహ్మ; + మా. ఛం - మాత్రాఛందస్సు )

0—0

## సరస్వతీ సపర్యా మహోత్సవములు

— శ్రీ సత్యవోలు

వేదార్థవాచస్పతి స్థానిక సీతంపేట వాస్తవ్యులు బ్రహ్మశ్రీ రేమెళ్ళ సూర్య ప్రకాశ శాస్త్రి ఉత్తమ శ్రేణి సంస్కృత పండితులని, రాష్ట్రపతి అవార్డులకు ఎంపిక చేసిన పన్రెండు సంస్కృత పండితులలో ఆంధ్ర ప్రదేశ్ నుంచి ఈ సంవత్సరం వీరు ఎంపికైనట్లు, గౌరవపురస్కారంగా 10 వేల రూపాయలనగదుతోబాటు ఒక మెమెంటో, సర్టిఫికెట్‌ను సంక్రాంతిలోపు రాష్ట్రపతి భవనంలో జరిగే ఒక కార్యక్రమంలో యిస్తారని, గతంలో యిటువంటి గౌరవం రాష్ట్రపతి వి. వి. గిరి ; శ్రీ విశ్వనాథ జగన్నాథఘనపాఠికి అందజేశారని ఆంధ్ర యువతీ సంస్కృత డిగ్రీ కళాశాల ఇన్‌చార్జి ప్రిన్సిపాల్ శ్రీమతి ఎ. మహాలక్ష్మమ్మ సదనంలో 24 వ తేదీన పరిచయం చేశారు.

స్థానిక ఆంధ్రయువతీ సంస్కృత డిగ్రీ కళాశాల (వైశ్యసేవాసదనం) లో జరిగిన సరస్వతీ సపర్యామహోత్సవముల తొలిరోజు కార్యక్రమంలో వేదార్థ సామ్రాట్ శ్రీ రెమెళ్ల ప్రసంగిస్తూ మన సదాచారములు ఎల్లరు పాటించవలసినవని, వేదమంత్రములతో ప్రమాణం చెప్పి, ప్రదూషవేళ అనగా సూర్యోదయాత్పూర్వం ఉదయం గం|| 4-30 లకు నిద్రలేవాలని తెల్పారు. ఇవి మూఢాచారములు కావని, వేదము మనకందించిన ఆరోగ్యసూత్రాలను, ఋషులు పురాణేతిహాసములద్వారా ధర్మసూత్రాలను వివరించారని తెల్పారు. మనది సనాతన ధర్మమని దీనిని పాటించినందువల్ల లాభాలు కలవని వివరించారు. రజస్వల అయిన స్త్రీ మూడు రోజుల పాటు దంతధావనం చేసుకోకుండా వుండాలని, ఆమె కూర్చున్నచోట వేరొకరు కూర్చుంటే బ్రహ్మహత్య దోషం వస్తుందని, పెద్ద చెంబుతో మాత్రమే నీరు త్రాగాలని మొదలగు స్త్రీలకు సంబంధించిన కొన్ని సదాచారములను చెప్పారు.

'వేద మీమాంసా విశారద' శ్రీ రేమెళ్ళ సూర్యప్రకాశశాస్త్రి రచించిన 'నిత్యకామ్య కర్మ మీమాంస' అను గ్రంథమును వేద శాస్త్రపరిషత్ ఆధ్వర్యంలో యిటీవల కృష్ణాష్టమి పర్వదినాన బ్రహ్మశ్రీ పేరి సూర్య నారాయణశాస్త్రి ఆవిష్కరించగా, కార్యదర్శి శ్రీ హోతా శివరామశాస్త్రి ఉమామార్కండేయ స్వామి దేవాలయంలో వెయ్యినూటపదహార్లతోను, దుశ్శాలువతోను వీరిని సత్కరించారు. సభకు శ్రీ వేలూరి వెంకట్రామయ్య అధ్యక్షత వహించగా, ఆంధ్రాబ్యాంకు జనరల్ మేనేజరు శ్రీ శంకరన్ ముఖ్య అతిథిగా పాల్గొన్నారు.

(*.*)

విజయభావన :

# 8. సుకవితాపరిమళభరితం "కల్హారకదంబం"

## (పద్య కవితాసంపుటి పరిచయం)

—శ్రీ కె. మార్కండేయులు

చక్కని సాహిత్యాభిరుచిగల ప్రచురణకర్తలుంటే మంచిపుస్తకాలు వెలువడతాయనే విషయం నిజమనిపిస్తుంది "కల్హారకదంబం" అనే యీ పద్యకవితాసంపుటాన్ని చూస్తే. పందమంది స్నేహితుల కన్న హితాన్ని చేకూర్చేది మంచి పుస్తకం అన్న సదుద్దేశంతో ఇలాంటి కవితాకల్హార పద్యకవితాసంపుటాలను వెలువరించే మనోజ్ఞా పబ్లికేషన్సు వంటి ప్రచురణకర్తలను ప్రోత్సహించాల్సిన అవసరాన్ని చాటిచెప్పేందుకే యీ చిన్ని పుస్తకాన్ని మీకు పరిచయం చేయడం.

ఈ కవితాకల్హారాలను అఘ్రాణింప చేసిన కవివర్యులు శ్రీ॥ శే॥ మారంపూడి వెంకట సుబ్బారావుగారు 1904 సం॥లో పశ్చిమగోదావరిజిల్లా అత్తిలిలో జన్మించారు. తండ్రిగారి పేరు నరసింహంగారు. వెంకట సుబ్బారావుగారు స్వగ్రామంలో కొంతకాలం వ్యవసాయం మరికొంతకాలం గుమాస్తా వృత్తి ఇంకొంతకాలం ఉపాధ్యాయవృత్తిచేసి 1953 నుంచి సంతానం విద్యాఉద్యోగాలరీత్యా హైదరాబాదులో స్థిరపడ్డారు. 14-10-1965 లో పరమపదించారు. 1935 నుంచి సుమారు మూడుపదులు అనేక కథలు వీరు రచించారు. వీరు తమ సాహితీ జీవితంలో అప్పుడప్పుడు రాసిన కవితలన్నిటినీ ఏర్చికూర్చి వారికుమారులు శ్రీ మారంపూడి వెంకటేశ్వరరావుగారు యీ కల్హారకదంబాన్ని అందించగా మనోజ్ఞా పబ్లికేషన్సు వారు ప్రచురించి కవిగారి ఆత్మకు ఆనందాన్ని కూర్చారని చెప్పడం అతిశయోక్తి కాదు.

ఈ కదంబంలో భగవత్స్తుతి, సుకవిస్తుతి, పురాణస్మృతి, లీలాప్రకృతి, హేలాజగతి అనే ఐదు శీర్షికలతో మొత్తం 26 కల్హారాలున్నాయి.

'ఇందులోని కవితలన్నీ బాగున్నాయి. పద్యాలు ధారాశుద్ధితోను సరళసుందరంగాను ఉన్నా'యన్న శ్రీ చిల్లర భావనారాయణరావుగారి ముందుమాటలోని పలుకులు, ఇందులోని కవితాకల్హారాలన్నీ సావధానంగా పరిశీలించిన పిమ్మట పదములయందలి పొందిక, పద్యములందలి రసానుభూతి, సంస్కృతీ సహితమైన కవిత్వమాధురి ఇవన్నీ సహృదయామోదంగా ఉన్నట్లు స్ఫురిస్తాయన్న ఆచార్య భావన్ గారి తదుపరి పలుకులు ప్రత్యక్షర సత్యాలేనని యీ పుస్తకం పూర్తి చేయగానే మనకనిపిస్తుంది. నేనంటాను గదా ఇందులో పద్యాలు సామాన్య పాఠకునికి కూడా సుబోధకమయ్యే విధంగా ద్రాక్షాపాకభరితంగా ఉన్నాయని.

భగవత్స్తుతి అనే మొదటిభాగంలో బ్రహ్మను, సరస్వతిని, సాయిదేవుని, వెంకటేశుని, ఈశ్వరుని స్తుతిస్తారు. వెంకటేశ్వరునికి లంచాలిచ్చేవుడని పైటలు ఇచ్చారు కవిగారు. దేవుళ్లు, దేవతలు, భక్తులకోర్కెలు తీర్చటందుకు లంచాలు తీసుకుంటారనే అభిప్రాయం రెండు మూడుచోట్ల వ్యక్తంచేసారు కవిగారు. వెంకటేశ్వరుడు ఆపద మ్రొక్కులను గుంజుతాడని అప్పులు గుంజేవాడనే భావంతో అంటారుగదా!

పత్రంబులున్న యవ్వారి,
చిత్రముగా పత్రులట్లు చెలగుచు నెగురున్
పత్రంబులేని మొక్కలు. ఛత్రంబులు
పట్టి పీడుసున్నిధి చేయున్'

"అని సాయిస్తవంలో నిన్నమ్మినవారలెన్నటికి నాశమొందంగరు," అన్నప్పుడు పోతన పదబంధం దర్శనమౌతుంది. 'నిన్ను మ్మిన వారలెన్నటికి నాశము లేదు గదమ్మ ఈశ్వరీ' అన్న రుక్మిణీకల్యాణ ఘట్టపు పద్యపాదానికిది అనుసరణ.

సుకవిస్తుతిలో పోతనను, గోపన్నను, త్యాగయ్యను, వేమన్నను, ఉమర్ ఖయ్యామ్ ను ప్రస్తుతించడం చూస్తే సామాన్య పాఠకులను కూడా సుపరిచితులైన ప్రజాకవులే కవి గారి ఇష్టదేవుళ్ళని చెప్పవచ్చు. పోతన కవిత్వం 'చిక్కని పాలపై మీగడ చెందిన మీగడ' లాంటిదని అంటారు. 'వేమనపద్యాలు చదివిన వారి కెవరికైనా ప్యాసుభవములు స్మృతికొస్తా'యని చమత్కరిస్తారు.

అలాగే పురాణ స్మృతిఅనే భాగంలో సావిత్రి, మేనకా విశ్వామిత్ర, కణ్వపరితాపం. వాలిసంతాపం, ద్రౌపదీమాన సంరక్షణ అనేక కవితలున్నాయి. కణ్వ పరితాపంలోని పద్యాలు కాళిదాసు శ్లోకాలను స్ఫురింపచేస్తాయి. 'అద్దిరకన్న బిడ్డల గృహస్థులుపీడ మరెంతకష్టమో' 'అన్నమాటలు' 'యాస్యత్యద్య శకుంతలేతి హృదయం' అనే శ్లోకాన్ని స్ఫురింప చేస్తుంది. అంతేకాకుండా అనువాదంలో తృప్తిచెందకుండా - పెంచిన

చదివేను అనే అర్థం వస్తోంది తెలుసుకొనేరు. ఈ నియమాలు అన్ని భాషలకు వర్తిస్తాయి. అని పంతులుగారు తెలుగులో వున్న 'కరియు,' "కరియు అనే క్రియల్ని ఉదహరించేరు -" ఈ ఇద్దరు ఇద్ద పంతకతికినా 'కతకదు' 'మేడూతంటకమేకాని 'దావ 'కరవదు' అని మనం చెబుతూ వుంటాం కదా! 'కరియు'' అనే ధాతువు 'కరవదు అయినప్పుడు తెలియు తెలవదు ఎందుకవకూడదు అని తిరిగివన్నే ప్రశ్నించేరు. అంతతో ఊరుకోలేదు భావరు స్పెన్సరు వ్రాసిన భాషలో చితెన్ను చెరినా దీహారచనలు ధైర్యాలేదు - అంతమాత్రాన ప్రాచీనులరచనలనువారు శ్రద్ధగా అధ్యయనం చెయ్యకపోలేదు. ఆ రచనలలో గల విశేషాల్ని అధునికులు వాడే భాషలో వ్రాస్తున్నారు. అనిదంగానే శ్రీనాధుడు మొదలైన మహాకవుల రచనలను నువ్వు శ్రద్ధగా చదివి ఆ గ్రంధాలలో గల వైశిష్ట్యాన్ని నేటివాడుక భాషలో తెలియజెయ్యి అని నాకు హితవు చెప్పేరు.

వారి సత్యసంధత, నియమానువరణ నేటి యువతకుమార్గదర్శకాలు. ఒకప్పుడు వీరిని, మద్రాసు విశ్వవిద్యాలయంవారు యూనివర్శిటీ కమిషన్‌లో భాషాశాఖకు పర్యవేక్షక సభ్యులుగా నియమించేరు. రామమూర్తి పంతులు గారు సంబంధిత నియమావళిని శ్రద్ధతో పరిశీలించి ఎం. ఏ. ప్యాసయినవారే అసలుకి అర్హులనిన్నీ తాను బి. ఏ. ప్యాసవడంచేత ఆ పదవిని స్వీకరించడానికి వీలులేదనిన్నీ, తన శిష్యుడైన డాక్టర్ బత్తా శేషగిరిరావు ఆ పదవికి అన్నివిధాలా అర్హుడు గనుక ఆపదవిని అతనికి ఇవ్వవలసినదని సిఫార్సు చేస్తూ ఆకాగితాలు తిరిగి విశ్వవిద్యాలయానికి పంపేసేరట. కోరివచ్చిన పదవిని చేతులారా వదలుకున్నారని వారి కుటుంబ సభ్యులు ఒకసారి చెప్పేరు. ఈ సంఘటన వారి సత్యసంధతకు ఒక మచ్చుతునక మాత్రమే.

పంతులుగారు పాతక్రొత్తలనుసరకులైన పరిశోధకులు. మహామేధావి. అయినప్పటికీ

# అంజలి

## 10. పూజ్య గాంధీజీ స్తవము

(అక్టోబరు 2 గాంధీజయంతి సందర్భమున)

— డా॥ బి. వరసింగ్‌ఖాన్ (వినయశ్రీ)

రవి యస్తాద్రి మునుంగనట్టి
 శతసామ్రాజ్యాధిపత్యంబు పీ
ఠువిపై కల్గిన యాంగ్లపాలనము
 మన్మూలింపగా జాలునా
హవమున్ వంపుటిలంగజేయ
 ప్రతిలో త్యాగప్రతాపాస్త్రమున్
చివురొత్తించిన ధీవిశారదుడు
 గాంధీజీ కివే యంజలుల్.

పేదలు కూడు గుడ్డయు లభింపక
 పేదన చెందుచుండగనే
నో! దరిలేని సౌఖ్యముల మాగుచు
 నుంటి విదేశి న్యాయమున్
కొనని పేదరైతువలె ఇద్దరు
 పాతకటిన్ ధరించిత
స్వా! దళిత ప్రజా జనబాంధవ!
 గాంధిమహాత్మ! ప్రాంజలుల్.

ధర్మ గరిష్ఠనిర్మల పథంబున
 యానము సేయ బుద్ధి
నిర్మితులైన నైతిక ప్రభావితవాక్య
 పథంచ జాలదే
దుర్మదపూర్ణ రాక్షసవిదూషిత
 దుష్ప్రభుత్వశక్తి యం
చర్మిలి మీఁటెదెచ్చిన మహామహితాత్మ
 మహాత్మగొల్చెదన్.

వర్మల చింతనోద్భవ సుశీత
 భావనకాన కృతిబ్రహ్మ
దుర్మదమైన కర్మమనసాపవరించుట
 పీడపోలు, శో
కర్మకు దగ్గ వేశ్యల వితాన మొనంగుట
 దేవుపాలు, ఓ
యూర్మియె నీకుమేలకు మహోత్తమలక్ష్య
 మహాత్మగొల్చెదన్.

---

ఆయన చంటిపిల్లాడంత అమాయకులు - గవర్నరు బహూకరించబోయే హిందూ కేసరి సువర్ణపతకాన్ని అందుకోడానికి వెళ్ళబోయే శుభవేళలో వారి సతీమణి ఆకుపచ్చ చొక్కాకు వెండిబొత్తాములు చేయించి పెట్టిందట- ఆ రోజులలో తులం వెండి అర్ధరూపాయి.

వెండితోచేసిన వస్తువులు, బంగారంతో చేసిన వస్తువులు స్త్రీలకేగాని, తన వంటి సామాన్యులకెందుకు? అని ఎలాగైననూ బొత్తాములు, తాను యదితరకు తొడుక్కున చొక్కావిడిచి ఈ చొక్కామోస్టి, వెండి బొత్తాములువుంచేసేరట. 'అంతఎత్తుకు పెరగడానికి ఎంత సంస్కారం కావాలనుకున్నావ్' అని మా సోదరుడు స్వర్గీయ క్రొవ్విడి లక్ష్మన్న ఎం. ఏ., బియల్. ఎన్నోసార్లు నాతో చెప్పేరు - ఆ పుంభావసరస్వతి, వి గర్వచూడామణి. యువతకు ఆదర్శ ప్రాయుడు -

-స్వస్తి

పతితజనమ్ముకంటె పతితుడౌట
పాపములేదు, హింసతో
పరత మునుంగువన్ భయము దాటుట
పిచ్చపుబుద్ధి, మానవం
బులకొలలేని సాహసవిహాయసమై
సుకృతాత్మమార్గ సం
చరణ మొనర్చుటొప్పనుచు చాటిన
గాంధి కివే సుమాంజలుల్.

కాలిన జీవనంబది ప్రపంచ
జన సమ్మతమందు నెందునే
ప్రాణికికూడ కూడని విపర్యయమయ్యెడు,
నట్టి దాస్యపుం
జాలిపేగ దోచెడు భావము గొల్పి
స్వరాజ్యపూజ్య దీ
క్షల జిలరేపిన ప్రగల్భుని
గాంధిని సంస్మరించెదన్.

స్వాతంత్ర్యమ్మది యిచ్చిపుచ్చుకొను
సంబారమ్ము కాబోదు, మీ
చేతమ్మందుదయించు కాంక్షయది,
తత్సిద్ధింగనన్ సర్వమున్
ప్రీతిన్ త్యాగమొనర్చియున్
భరతమాత్రూణంబు చెల్లింపుడన్
పూతావేశము గూర్చుజాతిజనకా!
పూజ్యా! నమస్కారముల్.

కత్తిని కత్తితో గెలువగా వలెనన్నది
క్షుద్ర బుద్ధి, యా
చిత్త వికారచేష్టితము చెల్లదు
మానవ సంఘమందు, పై
వృత్తిని గూడ ప్రీతిమెయి
మెత్తని మాటల లొంగదీయుచే
యుత్తమ నీతి యన్న మహమౌన్నతు
గాంధి మహాత్మగొల్చెదన్.

రాటమ్మున్ ప్రతి యింటిలోన
నయమారంగన్ ప్రతిష్ఠించి, వా
హాటమ్మౌ ప్రతిభన్ విదేశ వసన
వ్యామోహముంగాల్చి, యో

రాటమ్మున్ శమశీలతన్ సలుపు
దుర్వారోద్ధతింగూర్చి మేల్
బాటల్ దీటుగ దీర్చినట్టి ఘనుడా
బాపూజీ వర్ణించెదన్.

ఉప్పును గూడ నొక్క మహితోన్నత
దారుణ శస్త్రరాజమై
యొప్పగజేసి కాంతి రథికోత్తములన్
దగదీర్చి వ్యూహముల్
తప్పని రీతి నన్ని, భరత ధ్వజమున్
గగనాన స్వేచ్ఛమై
గొప్పగూడ జేసిన యకుంఠితదీక్షిత!
గాంధీజీ! నుతుల్.

అనయమహాంధమౌ ప్రభుత కంటకమున్
తెలిపించి, ఆత్మకో
ధన వెలిపించి, ధర్మమతన్ గలిపించి,
ప్రజాభిలాషమున్
గని యది సాగగా విరళవ్రత దీక్షబూని
ప్రాణమున్
తృణము విధాన త్యాగమొనరించు
మహాత్ముని కంజలించెదన్.

కేవల రాజకీయ పరకీయత
మాద్పు స్వతంత్ర శాంతితో
నావటిలంగబోదు కుఱ, మార్మిక
సాంఘిక నైతికాది రం
గావళులందు స్వచ్ఛమగునట్టి
స్వతంత్ర మెల్గనొప్పు, నో
భావహమౌ స్వరాజ్యమది
యౌనను గాంధిని సంస్మరించెదన్.

ఎచ్చట గ్లాని ధర్మమున కేర్పడు
నచ్చటి కేగి చెచ్చెరన్
పొచ్చెము తీర్చజాలుదు, ప్రభుత్వ
మొదంబడదేని నీ పదం
బచ్చట పాదుకొల్పియసహాయ
మహో యుధమాయమర్త్యలే
మెచ్చునయాప్తి గూర్చెదనమేయ
కృపానిధి గాంధీజీ! నుతుల్!

స్వారాజ్యమ్మయి రామరాజ్యమయి
సంస్తవ్యాచ్ఛ రాజ్యమ్మయై
తీరంగావలె మాస్వరాజ్యమను
నీదివ్యాఖ్యతావద్రుమే
హేరాళంబగు పూలుపూచి
రసభూయిష్ఠంబులౌ పండ్లు చే
కూరం జేసెను మాకు మాన్య
చరితా! కొల్లాయి మౌనీ! నుతుల్.

మద్యము మానప్రాణధన మానసముల్
హరియించుమారి యా
మద్యమె దేశదుర్గతి కమందనిదాన
ముగాన నింద్యమె
మద్యమహాపిశాచి బరిమార్చు
టయే వరదీక్షగా, గరి
ష్ఠోద్యమమున్ సృజించి జయమొందిన
గాంధిఘనున్ స్మరించెదన్.

ఎంతటి చిన్నదైన పనినేని
యకుంఠిత దీక్షతోడ, గో
రంతయు తప్పురానిగతి యాదృతి
మీఱగ చేసెదారయ! యిం
తింతయు నింతయున్ గలిసియే
బృహదాకృతి పొందునంచు, బో
ధింతు వహర్నిశల్ విధివిధేయ!
మహాత్మ! నమస్సులందుమా!

కూడున్ గుడ్డయురాని పెట్టి
చదువుల్ కొల్లలై యుండి యా
నాడున్ గూల్చెనె! వృత్తి
విద్యలెలమిన్ భాసిల్లనన్నార్తుడై
వాడున్ గూడ ధరిత్రిమండల
స్థిరవ్యాసంగముంగల్గి, యే
గోడున్ లేక సుఖించునంచు హితము
ద్ఘోషించు బాపూ నుతుల్!

వందకు వేరనీక, మతివర్జ
నొకిందుక కారనీక, బా
ధించెడు సద్భుజమ్ములకు విక్కలి
మిక్కిలి జేసినావహో,

## నన్నయభట్టారకుని
## —— భారత సూక్తిరత్నములు ——

సంకలనం :
కీ॥ శే॥ విద్వాన్
బులుసు సీతారామశాస్త్రి

సర్వభూతదయకు సత్యవాక్యమునకు
నుత్తమంబు ధర్మ మొండెయుంగ
వారలొప్ప కోడ కుపతాప మొనరించు
నదియు కడు నధర్మ మనిరి బుధులు.

ఆది 8-219

సమస్త ప్రాణులందు దయ గలిగి యుండుట, సత్యము పలుకుట యనువాని కంటె మఱియొక యుత్తమధర్మ మెందియు లేదు. ఇతరుల బాధకు జంకక వారికిఁ బరితాపముఁ గలిగించుట మిక్కిలి యధర్మము. ఈ విధముగాఁ బండితులు పలుకుదురు.

వేదవిహిత విధుల నాదరించుట యూర్ధ్వ
గతికిఁ దెరువు. విధులఁ గడచి యొందు
వాఁగఁబడినవాని లోఁగక చేయుట
యధమగతికి మార్గ మనిరి బుధులు.

ఆది 3-220

వేదములందుఁ జెప్పఁబడిన కర్మముల నాచరించుట ఉత్తమగతికి మార్గమని, శాస్త్రముల నతిక్రమించి నిషేధింపఁ బడిన కర్మములను సంకోచింపక చేయుట యధమగతికి మార్గమని పండితులు తెలిపి యుండిరి.

నుతజలపూరితంబు లగు
నూతులు నూటికంటె నూనృత
వ్రత యొకబావి మేలు మఱి
బావులు నూటికంటె నొక్క స
త్క్రతు వదిమేలు తత్క్రతు శ
తంబున కంటె సుతుండు మేలు త
త్సుత శతకంబు కంటె నొక
సూనృతవాక్యము మేలు సూడఁగన్.

ఆది 4-94

ప్రశస్తమైన నీరుగల నూఱు చేఁదుడు బావులకంటె నొక దిగుడుబావి మేలు. అట్టి నూఱు దిగుడుబావులకంటె నొక మంచి యజ్ఞము మేలు. అట్టి నూఱు యజ్ఞములకంటె నొక్క కుమారుఁడు మేలు. నూఱుగురు కుమారులకంటె నొక్క కుమారుఁడు మేలు. నూఱుగురు కుమారుల కంటె నొక్క సత్యవాక్యము శ్రేష్ఠమైనది.

వెలయంగ నశ్వమేధం
బులు వేయును నొక్క సత్యమును
నిరుగడలం
దుల నిడి తూఁచఁగ సత్యము
వలనన మొగ్గూపు గౌరవంబున
పేర్మిన్.

ఆది 4-95

చక్కఁగా వేయి అశ్వమేధయాగములను, నొక్క సత్యమును త్రాసునందు రెండువైపుల నుంచి తూఁచినచో సత్యమున్నవైపునకే బరువు నధికమగుటచే త్రాసుముల్లు మొగ్గును.

సర్వతీర్థాభి గమనంబు సర్వవేద
సమధిగమము సత్యంబుతో సరియుఁగావ
యెఱుఁగు మెల్ల ధర్మంబుల కెందుఁ బెద్ద
యండ్రు సత్యంబు ధర్మజ్ఞులైన
మునులు.

ఆది 4-96

సర్వతీర్థయాత్రలు చేయుటయు, సమస్తవేదములు నేర్చుటయు నొక్క సత్యమునకు సమానమైనవు గావు. ధర్మము తెలిసిన మునులు సర్వధర్మములకంటెను సత్యము గొప్పది యని చెప్పుదురు.

( సశేషము )

1, 16 తేదీలలో ప్రచురింపబడును

విడి ప్రతి 0-60 పై. 6 మాసములకు రు. 6-50 సంవత్సర చందా రు. 12-00

Editor, Printer and Publisher B. Ravikanth, Printed at B. V. & Co. Press,